Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ సెప్టెంబరు నెల 19 వ తేది శుక్రవారం [నె 27 రు

## జర్మనీకి రూజువెల్టుగారి హెచ్చరిక.

### అమెరికా రక్షణసముద్రములందు విషసర్పములవలె తిరుగు జర్మను నౌకలను అమెరికా నౌకాదళం హతమార్చును.

అట్లాంటిక్ సముద్రయుద్ధంగూర్చి, అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారు జర్మనీకి గంభీరముగు హెచ్చరిక చేసిరి. అమెరికా నౌకాదళాధికారి హెూదాల్లో వారు తమ సైన్యమునకు క్రొత్తవిధానము సూచించిరి. అది యిట్లుండుననిరి :— "అమెరికా రక్షణకు అవసరమగునంతమేర అమెరికా చుట్టునున్న సముద్రములలో జర్మను జలాంతర్గాములుగాని, యుద్ధనౌకలుగాని దాగియుండి తమను కొట్టువరకు అమెరికను నౌకలును విమానాలును వేచియుండవు. విశాలమగు అట్లాంటికు సముద్రమును అమెరికా నౌకాదళమునకు చెందిన విమానాలు కాపలాకాయుచున్నవి. స్వేచ్ఛగ సముద్రాలపై ప్రయాణంచేసుకొను హక్కును కాపాడే బాధ్యత ఆ విమానాలపై గలదు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే అమెరికా రక్షణసముద్రములందు ప్రయాణంచేయు వర్తకనౌకలన్నింటిని అమెరికాదేశానికి చెందినవేకాక, యితర దేశాల వాటినిగూడ అమెరికా నౌకలును విమానాలును కాపాడుచుండును." అనగా అమెరికా రక్షణసముద్రములం దెచటనైన అక్షరాజ్యముల యుద్ధనౌకలుగాని జలాంతర్గాములుగాని కనబడగానే వాటిపై గుండు ప్రేల్చబడును.

### ఇందుకుకారణం : అమెరికా స్టీమరులు 7 దెబ్బతిన్నవి.

అధ్యక్షుడు రూజువెల్టుగారు యిట్టి ప్రధానమగు ప్రకటన చేయుటకు కారణమేమిటి? అదేదో వారే రేడియో ఉపన్యాసంలో యిట్లు తెలిపిరి :—

1. కొన్ని నెలలక్రిందట అమెరికా పతాకంతో ప్రయాణంచేయుచున్న అమెరికా వర్తకనౌక "రాబిను-మూరు" అనునది జర్మను జలాంతర్గామిచే ముంచివేయబడెను. ఇది అంతర్జాతీయ న్యాయనియమాలకు విరుద్ధచర్య. అందలి ప్రయాణికులు తీరానికి అనేకవందలమైళ్లదూరాన నడిసముద్రంలో చిన్నపడవలలో వదలివేయబడిరి. జర్మనుప్రభుత్వం కూడా సంతకంచేసిన అంతర్జాతీయ ఒడంబడికప్రకారం యిట్లుచేయరాదు. ఇట్టి అన్యాయంచేసికూడ జర్మనుప్రభుత్వం పొరపాటు జరిగిందని క్షమాపణైనా కోరలేదు, నష్టపరిహారమిస్తానన లేదు.

2. 1941 జూలైలో ఒక అమెరికా యుద్ధనౌకను ఒక జలాంతర్గామి వెంటాడి ముంచివేయ యత్నించెను. అందుకు కారణంలేదు. అక్కడికి నూరుమైళ్ల దూరంలో బ్రిటిషువారివిగాని అమెరికావిగాని జలాంతర్గాములు లేవు.

3. ఆగస్టు 17 వ తేదిన అట్లాంటికు ఉత్తరభాగమునందున్న గ్రీనులందు చేరువను అమెరికాదగు సెస్సాయను నౌక ఎట్టి హెచ్చరిక లేకుండా టార్పెడోతో ముంచివేయబడెను. అందులో ఐసులాండు ప్రజలను వస్తువులు పోవుచుండెను. చాలమంది ప్రయాణీకులు ముంచివేయబడిరి.

4. సెప్టెంబరు 2 వ వారమునందు "స్టీలుసీఫేరరు" అను అమెరికను నౌక ఆరేబియా, ఆఫ్రికాల మధ్యనున్న ఎర్రసముద్రమునందు సూయజ్ కాల్వకు 270 మైళ్ల దూరంలో నుండగ జర్మనువిమానంచే ముంచబడెను.

5. సెప్టెంబరు 14 వ తేదిన అమెరికా డిస్ట్రాయరు యుద్ధనౌక "గ్రీరు" అనునది పట్టపగలు గ్రీనులండుకు దక్షిణమున టార్పెడోతో కొట్టబడెను. అది ఐసులాండునకు టపా తీసుకపోవుచుండెను. అమెరికా పతాకంకల్గియుండెను. కాని గురితప్పిపోయెను. దెబ్బమాత్రం కొట్టాలని కొట్టిందే.

6, 7. అధ్యక్షుడుపన్యసించినపిదప మరిరెండు అక్రమాలు జరిగేయి. మంటోనా అను అమెరికాపతాకంగల నౌక సెప్టెంబరు 11 వ తేదీన ముంచివేయబడెను. ఆనాడే సూయజు నగరంపై జర్మనులదాడిలోపడిన గుండుముక్కలు తగిలి "అర్కాన్సను" అను అమెరికా నౌక చెడిపోయెను.

జర్మనీ ఎందుకీ అక్రమాలు చేస్తున్నది? న్యాయవిరుద్ధము నీతిబాహ్యమునగు చర్యలు చేస్తున్నదని అధ్యక్షుడనెను. ఇవి ఏవో నాటునూటు జరిగిన అకృత్యాలు కావు. అంతర్జాతీయ న్యాయం మంటకలిపి సముద్రాలపై ప్రయాణానికి భద్రత లేకుండాచేసి, అన్ని సముద్రాలపై తామే అధికారం వహించాలని నాజీ జర్మనీ వేస్తున్న ఎత్తులివి. సముద్రాధిపత్యం సంపాదించినచో, అమెరికా సంయుక్తరాష్ట్రములనుగూడ ఓడించుటకు జర్మనీకి సులభమగును.

అమెరికా కోపానికి యింకా కారణాలు కలవు. పశ్చిమార్థగోళమగు అమెరికాయందు హిట్లరు గూఢచారులెందరోచేరి కుట్రలు పన్నుచున్నారు. పరిశ్రమలను పడగొట్ట యత్నించుచున్నారు. నిరుడు ఉరుగ్వే ప్రభుత్వాన్ని వశపరచుకొనాలనుకుట్ర విఫలమయింది. అర్జెంటైనులో ప్రభుత్వంకూడా యిట్టి కుట్రలు ముందుగ కనుగొని అణచివేసెను. బొలివియాలోగూడ అట్లే జరిగెను. కొలంబియా రాష్ట్రములో పనామాకాల్వ చేరువలో రహస్య విమాన నిలయము లగుపడినవి.

జర్మనీ నౌకలను జలాంతర్గాములను అమెరికా ముంచేస్తాననడానికి మూడు కారణాలు కలవు :—

1. అమెరికా సంయుక్త రాష్ట్రములను రక్షించుటకు బ్రిటిషు నౌకాదళం అవసరం. అది భద్రంగా ఉంటేనే అమెరికా నౌకాదళం అజేయంగా నుండగలదు.

2. సముద్రాలపై స్వేచ్ఛగ, ప్రయాణం చేయుటకు అన్ని దేశాలవారికి హక్కుండాలని అమెరికా ఆదినుండి తెల్పుచున్నది. అది ప్రధానమయిన హక్కు. యుద్ధరంగాలకు అతి దూరంగానున్న విశాల సముద్రాలయందు యితర దేశాల నౌకలు తిరుగకుండా ప్రమాదాలు కల్పించడానికి ఎవ్వరికీ అధికారంలేదు. పడమటి అర్థగోళంపై అధికారం చెలాయించాలను ఆశతో హిట్లరు అంతర్జాతీయ న్యాయ సూత్రాలను ఒడంబడికలను అతిక్రమిస్తున్నాడు.

3. హిట్లరు శత్రువులకు సరకు సప్లై నిరాటంకంగా అందుతూవుండాలి. రూజువెల్టుగారిట్లాన్నారు :—" విమయి

నా సరే, ఎంత ఖర్చయినా సరే మా రక్షణ సముద్రాల యందు న్యాయమగు యీ వాణిజ్యం కొనసాగుతూ వుండాలి. హిట్లరుతో యుద్ధం మే మిదివరకు కోరనూలేదు, యిపుడునూ కోరం. మేము శాంతిని ఎక్కువ కోరుచుండుటచేతనే, అందు కెంత త్యాగమయినాచేసి, మా నౌకలు అతని గుండ్లబారి కెదురుగాకూడ పోనిస్తున్నాం. నాగుపాము మిమ్ము కొట్టడానికి పడగ ఎత్తినపుడు అది కొట్టేవరకు వేచి యుంటారా? అది కొట్టేలోగానే దాని పడగచితుక కొడతారు. నాజీ జలాంతర్గాములును, యుద్ధ నౌకలును అట్టి కాలసర్పములే, అట్లాంటిక సముద్రమునందు తిరుగుచున్నవి. సముద్ర రాదారీలందు దారి కడ్డుగానున్నవి. మా రాజ్యాధికారము నవి ధిక్కరించుచున్నవి.

## జర్మనీ నూతన వ్యవస్థ.

“ప్రపంచమంతటు నూతన వ్యవస్థస్థాపిస్తానను జర్మనీ యత్నమును అణచివేయాలి. దౌర్జన్యం, భీభత్సం, హత్యలపై నాజీలాధారపడియున్నారు. పడమటి ప్రపంచానికి నాజీల ముప్పు ఎన్నడో వచ్చేదికాదు, అపుడే వచ్చియున్నది. ఈ శత్రువు సైన్యవ్యూహంలో మాత్రమేలేదు; న్యాయానికి, స్వేచ్ఛకునీతికి,మతానికి అన్నింటికి శత్రువుగానున్నాడు. ప్రపంచాన్నంతా కత్తిబలంతో దౌర్జన్యంతో జయించాలని చూస్తున్న యీ రాక్షసులకు:—“మా బిడ్డలను బిడ్డల బిడ్డలను మీ బానిసలుగా చేసుకోజూస్తున్నారు. ఇపుడు మా స్వేచ్ఛనే భంగంచేయచూస్తున్నారు? ఇక చాలించండని” చెప్పాలి. అని అధ్యక్షుడనెను.

జర్మనీ కోరితేగాని గుండ్లు ప్రేల్చడం జరుగదని చెపుతూ అధ్యక్షుడిట్లనెను:—“నే నిపుడు గైకొన్న చర్యగురించి నాకెట్టి సంకోచంలేదు. నేను తొందరపడలేదు, నిర్లక్ష్యభావంతో చేయలేదు. నెలల తరబడి యెంతో ఆలోచించి దైవం తోడుగాచేసిన పని యిది. మీయొక్కయు నాయొక్కయు మాతృదేశ రక్షణకు యిది యెంతయో అవసరం.”

## రక్షణ సముద్రాలేవి.

అధ్యక్షుడు పేర్కొన్న రక్షణ సముద్రాలంటే యేవి యని అనేకమంది అనేకవిధాలుగా అనుకుంటున్నారు. అమెరికా యుద్ధ నౌకలే ముందుగా గుండ్లు ప్రేల్చుటకు నిర్ణయింపబడిన రక్షణ సముద్రాలంటే యేవో జర్మనీ చర్యలే నిర్ణయించగలవని కార్డెలు హాలుగారు (అమెరికా మంత్రి) అన్నారు. ప్రపంచంలో యేమూల తమ నెదుర్కున్నా అమెరికా తిరిగి దెబ్బకొట్టునని అధ్యక్షుని మాటలలో స్పష్టంగా తెలుపబడింది. అమెరికా తీరపు రేవులకును ఐసులాండు దీవికి మధ్యగల సముద్రమంతా రక్షణ సముద్రంగా నెంచబడును. అమెరికా నౌకా శిబిరాలు యేర్పరచుకొన్న సముద్రాలన్ని ‘రక్షణ సముద్రాలు’గా నెంచబడునని చెప్పబడెను.

## జర్మనీలో కలవరము.

తానిపుడు ప్రకటించిన విధానం అమలుజరుపుటకు మొదటి చర్య జర్మనీ చేష్టలపై నాధారపడియుండునని అధ్యక్షుడనెను. అధ్యక్షుడే తటస్థ చట్టమును ముందుగ నుల్లంఘించి నిందంతా జర్మనీపై మోపుతున్నాడని జర్మనీ నిందించుచున్నది. అతను చూడగానే కొట్టుమని తన నౌకలకు ఉత్తరువుచేసినందున యీ ప్రకటనలో వింత యేమిలేదని జర్మను రేడియో తెలిపెను. తన దేశాన్ని యుద్ధంలో దింపాలనే రూజువెల్టు సంకల్పమనెను.

ఇటలీలో ముసోలిని తరఫున ప్రకటించుచుండు సీనరు గయడాగారు అధ్యక్షుడు రూజువెల్టుగారి ఉపన్యాసంపై విమర్శించుచు, ఇటలీ జర్మనీలు యుద్ధం వ్యాపింపకుండా చేయాలని చూస్తూవుంటే సంయుక్తరాష్ట్రముల (వాషింగ్టను) ప్రభుత్వం తన రక్షణ సముద్రములంటే నైసర్గిక సరిహద్దులేవో చెప్పక యెంతేనా పెంచడానికి వీలుగానుంచినదనెను.

ఇపుడు జర్మనీ యేమిచేస్తుందో స్పష్టంగా తెలియదు. అమెరికా నావలను కొట్టకుంటే అట్లాంటిక యుద్ధంలో ఓడుతుంది; కొట్టితే అమెరికాను యుద్ధంలోకి దించినట్లవుతుంది. జర్మనీ యేమిచేస్తుందో యెవ్వరు జోస్యం చెప్పలేరు. కాని, పసిఫిక సముద్రంలో జపాను యేదేన అమెరికాకు ప్రతికూల చర్య చేసేవరకు జర్మనీ వేచియుంటుందనుకుంటున్నారు. జపాను అట్లాచేస్తుందా? అమెరికా యింకా జర్మనీపై దాడిచేయలేదు. కావున త్రిరాజ్యాల (ఇటలీ-జర్మనీ-జపాను) ఒడంబడిక ప్రకారం జర్మనీకి జపాను యీ విధంగా తోడ్పడవలసిన అవసరంలేదు. జపానుకూడ తొందరపడక వేచియుండాలనే చూస్తుంది. రష్యా ఓడిపోతే అపుడు జపాను దూరప్రాచ్యమునందు తన కోరలు చూపగలదు. కాని అట్టిది యిప్పట్లో సంభవించదు.

## రూజువెల్టు ఉపన్యాసంగూర్చి యితర ప్రపంచం ఏమనుకుంటున్నది.

జర్మనీ నౌకలు కనబడగానే ముంచేయాలని అధ్యక్షుడు గావించిన ఉత్తరువు అమెరికాను యుద్ధంలోకి దించుతుందని అమెరికాలోని యుద్ధం కూడదనేవారు భావిస్తున్నారు. ఇదే సక్రమం కానటువంటి యుద్ధప్రకటననికూడా వీరిలో కొందరంటున్నారు. అధ్యక్ష పదవికి పోటీచేసిన వెండలు విల్కీగారు యీ క్రొత్తవిధానాన్ని మెచ్చుకున్నారు. ఇటువంటి ముఖ్యమగు హక్కును అధ్యక్షుడు రూజువెల్టుగారు వదులుకోలేరన్నారు. అధ్యక్షుడంత కటువుగానుండక మెత్తపడినచో వినాశకరమగు యుద్ధంతప్పదనిరి. అమెరికా పత్రికలన్ని రూజువెల్టుగారి ప్రకటనను కొనియాడినవి. ఈ ప్రకటన వలన జర్మనీతో యుద్ధంవస్తే రావచ్చుకాని యుద్ధం తప్పించే అవకాశం జర్మనీకి కలదన్నవి. “అమెరికా ముందుగా గుండు ప్రేల్చేరోజులు యింతకాలానికి వచ్చాయి. వెనక్కి తగ్గడం, డొంకతిరుగుడుగా పోవడం, నాన్పుడుగా జవాబుచెప్పడం యివన్ని అంతమయినాయి” అని ఒక పత్రిక వ్రాసింది.

ఇంగ్లాండూ, సామ్రాజ్యదేశములందు రూజువెల్టు క్రొత్త విధానం హిట్లరుపై సవాలుగా నెంచబడింది. అమెరికా చాల చొరవ చేసుకొని త్యాగానికి సిద్ధపడుతున్నది. కాని అట్లు చేయుట స్వరక్షణకేగాక ప్రపంచమంతటిలో స్వాతంత్ర్యరక్షణకు చేయుచున్నది. ఆస్ట్రేలియా కార్మిక నాయకుడు కర్టినుగారు చక్కగ చెప్పేరు. “ఒక గొప్పదేశం తరపున గొప్ప వ్యక్తి గొప్ప ఉపన్యాసం చేసెను.” యుద్ధంలో దిగిన రాజ్యాలు, దిగని రాజ్యాలు అన్న వ్యత్యాసం చూడడం మానివేసి యుద్ధరంగాలకు పంపు సరకులకు కాపలా యొసంగుటకన్న మించిన సహాయమునే యిపుడు అమెరికా చేస్తున్నది. ఇపుడు బ్రిటిషు నౌకాదళం పశ్చిమ అట్లాంటికులో వర్తకనౌకల కాపలా బాధ్యత అమెరికాకు విడిచి తూర్పు అట్లాంటిక రక్షణయందు శ్రద్ధ వహింపగలదు.

## 125 అమెరికా నౌకలు సిద్ధం.

రూజువెల్టుగారు ఉపన్యాసంలో వాగ్దానం చేసినప్రకారం వారి ప్రభుత్వం వెంటనే ఆచరించెను. సెప్టంబరు 16 వ తేదినుండి అరువు కౌలు చట్టం ప్రకారం అమెరికానుండి యూరోపునకు, ఐసులాండునకు పోవు సామాను నౌకలన్నింటికి సహాయంగా యుద్ధనౌకలను పంపవలెనని అమెరికా నౌకాదళమునకు ఉత్తరువుచేసిరి. అక్ష-రాజ్యాల నౌకలుగాని సబుమెరైనులుగాని కనబడగానే ముంచివేయుటలో పట్టుకొనుటలో చేయాలని ఆజ్ఞగలదు. అమెరికానుండి బ్రిటిషు రేవులకువచ్చు నౌకలన్ని కనబడగానే ముంచేస్తానని హిట్లరు

ముందొకసారి సవాలు చేసియుండెను. ఆ సవాలునకు యిపుడు అమెరికా జబాబు చెప్పినది. ఇపుడు హిట్లరుకి గడ్డు సమస్య యేర్పడినది. అమెరికా నౌకాదళ కారదర్శి కర్నలు నాక్సు గారు చెప్పినట్లు, హిట్లరు బ్రిటనుకు పోవుచున్న అమెరికా నౌకలను విడచినచో ఇంగ్లాండును ఓడించుట కష్టమగును. అట్లుగాక వాటినెదుర్కొని ముంచినచో అమెరికా శత్రు వర్గమున చేరును. అమెరికా యుద్ధంలో దిగకతప్పని పరిస్థితులేర్పడునని నౌకాదళ సహాయ కార్యదర్శి నుడివెను. అమెరికా సంయుక్త రాష్ట్రముల అట్లాంటికు నౌకాదళం యుద్ధ చర్యకు సిద్ధమయినది. కాన్వాయి—అంటే వర్తక నౌకలకు యుద్ధనౌకల కాపలాయే యిపుడు జరుగుచున్నది. 125 అమెరికా నౌకలు యీపనికి సిద్ధంగానున్నవి.

# ఇరాను పాలకుడు పారిపోవుట

## జర్మనీపై అభిమానం వదలలేకుండెను : మంత్రివర్గానికి రాజుకు పడలేదు.

### బ్రిటిషు-రషియా సేనలు టెహరానుపైకి బోవుట.

ఇరాక్ (పెర్షియా) విషయమై ప్రతివారం యీ పత్రికలో చదువుతునేవున్నారు. ఆ ఇరానులో పరిస్థితులు మరల తమాషాగామారినవి. పాలకుడగు షాగారు ముఖ్య పట్నమగు టెహరను విడచి ఇస్పహానుకు పారిపోయెను. ఆరోగ్యం బాగులేదని కారణం తెలుపబడెను. అతని పెద్ద కుమారుడు రాజ్యాధిపత్యం వహించెను. ఈతను ఈజిప్టు దేశపు రాజసోదరియగు షాజిమాను 1939 వ సంవత్సరములో వివాహమాడెను.

ఇరాను షాగారో దారి తీస్తే వారి మంత్రివర్గం యింకో దారి తీసేది. అతడు నాజి జర్మనీకి అనుకూలుడు, అతని ప్రభుత్వం బ్రిటనుకు అనుకూలం. ఇరానులో పార్లమెంటు క్రొత్త మంత్రివర్గంలో విశ్వాసమున్నట్లు ప్రకటించెను. రషియా-ఇంగ్లాండులతో ఇరాను ప్రభుత్వం గావించిన ఒడంబడిక షరతులను అనుసరించాలనే పార్లమెంటు కోరుచుండెను. షాగార్కు మాత్రము ముభావంగానుండిరి. అతడు ప్రోత్సహించి ఎటిలాటు అను ఇరాను పత్రికలో ఒక వ్యాసం వ్రాయించెననియు, అందు జర్మనీ-ఇటలీల రాయబారవర్గములను దేశంలో ఉండనిచ్చి అక్షరాజ్యాలతో రాజకీయ సంబంధం యథాప్రకారముంచవలెనని సూచింపబడెను. ఆ పత్రికను ఇరాను ప్రభుత్వం అణచివేసెను. దేశపరిపాలన వ్యవహారముల విషయమునందు గూడ ఇరాను ప్రజలు అసంతృప్తి చెందియున్నారు. ప్రజలు కోరిన రాజకీయ సంస్కరణలను షాగారొసంగుట లేదు. రాజకీయ పరిస్థితులిట్లు అస్థిరంగా ఉన్నందున బ్రిటిషు సైన్యాలు రషియను సైన్యాలు టెహరానుకు పోవలసివచ్చింది. నాజి అనుకూలురు యింకా కొందరచ్చటచ్చటనుండి కుట్రలు పన్నుచున్నప్పటికి, ఇరాను ప్రభుత్వవైఖరి విషయమున ఎట్టి సందేహంలేదు.

ఏది ఎట్లున్నా ఇరానులోనున్న జర్మనుపీడను తొలగించి తమకార్యం సాధించాలని మిత్రమండలి ప్రభుత్వములు నిశ్చయించినవి. వారి కార్యము లేవనగా ఇరానులోని ప్రజలకు తిండిలేకుండా బదనికవలె పీడించుచున్న జర్మనులను తొలగించుట ; ఇరాను చమురు గనులను మిత్రమండలి వశమునందు భద్రపరచుకొనుట ; పర్షియను గల్ఫునుండి కాస్పియను సముద్రంవరకు మార్గములు వశపరచుకొని ఇరానుమీదుగా రషియాకు సైనిక పరికరములు సప్లైలన్ని అందేటట్లు భద్రపరచుకొనుట.

### బ్రిటనుతో జర్మనీ సాటియా ?

ఇరాకులోవలెనే ఇరానులోగూడ బ్రిటిషు ప్రభుత్వ సైనికచర్య శాంతిని చేకూర్చగలదు. బ్రిటను ఇరాకులో రషీదాలి కుట్రలను అణచివేసి, ప్రభుత్వాన్ని వశపరచుకొని శాంతిచేకూర్చి, తిరిగి సక్రమపాలకుని సింహాసనంపై అధిష్టింపచేసి, పరిపాలనాధికారం తిరుగుబాటువారులకు శిక్షించే అధికారం కూడ ఇరాకు ప్రభుత్వానికే విడచిపెట్టెను. జర్మనీ ఏమి చేస్తున్నదో చూడండి. తానాక్రమించిన రాజ్యాలలో ప్రజల హక్కులన్ని అణచివేసి పాలకులను వారి వంశాలను చంపివేయుటకు యత్నించి, సక్రమ పాలనాధికారాలన్ని మంటగలిపి, దౌర్జన్యంతో పరిపాలిస్తూ, ఆదేశాలకు తిండిలేకుండా దోచుక పోతున్నది. శత్రువుల తరఫున కుట్రలు పన్నుచున్న వారిని మాత్రమే బంధించాలని బ్రిటను తలపెట్టగా, జర్మనీ తానాక్రమించిన దేశాలలో రాజకీయంగా ఒత్తిడి కలిగించుటకై సివిలు ప్రజలను బాధించి చంపుతానని బెదరిస్తున్నది. వేలకువేల కార్మికులను తన యుద్ధకార్యాలకు పనిచేయ నిర్బంధించి గూఢచారులను పంపి కుట్రలు పన్నుచున్నది.

# ఫిన్లాండు ఎవరిపక్షం ?

## చివరంట రష్యాతో పోరునా, సంధిచేసుకొనునా ?

[ఫిన్లాండు రష్యాకు పశ్చిమోత్తర భాగమందుగలదు. ఉత్తరమున ఆర్కిటికు సముద్రం, నార్వేయు, పడమట స్వీడను బాల్టికు సముద్రము, దక్షిణమున ఫిన్లండు గల్ఫు, తూర్పున రష్యా, దీనికి సరిహద్దులు. హెల్సింకి లేక హెల్సింగ్ ఫోర్సు అనునది రాజధాని నగరం. 135,000 చ॥ మైళ్లు, 3,800,000 జనసంఖ్య. ఈదేశంలో నూరులో పదో వంతు స్వీడను దేశీయులు గలరు. 1154 నుండి 1809 వరకు స్వీడనులో భాగంగానుండేది. తరువాత రష్యాలో చేరిన స్వతంత్ర రాష్ట్రంగానుండెను. 1917 వ సంవత్సరమున రష్యాలో విప్లవం వచ్చినపుడు ఫిన్లాండు విడబడి స్వాతంత్ర్యం ప్రకటించింది. రషియను కమ్యూనిస్టులు యీ దేశాన్ని ఆక్రమించాలని చూచినా, జర్మను సేనల సహాయంతో ఫిన్లాండు దేశీయులే గెలిచిరి. అందుచే అప్పటినుండి రష్యాకు ఫిన్లాండుకు వైరమే. పార్లమెంటరీ పరిపాలనగల దేశం. సోషలిష్టు పార్టీ బలం ఎక్కువ. గాని కమ్యూనిష్టులకు ప్రతికూలం.]

ఈ యుద్ధం ప్రారంభముకాగానే సోవియటు రష్యా 1939 వ సం॥ అక్టోబరులో ఫిన్లాండుకు కొన్ని షరతులు పంపి అవి అన్యాయముగానున్నందున ఫిన్లాండు ప్రభుత్వం అంగీకరింపకపోగానే నవంబరులో సైన్యాలనుపంపి దాడిచేసెను. మూడు నెలలు ఫిన్లాండు దేశీయులు హోరాహోరీ పోరాడిరి. ఫిన్లాండు దక్షిణమున లడోగా సరస్సునకు ఫిన్లాండు గల్ఫునకు మధ్యగల సన్నని భూసంధి కడ్డముగా మానరుహీముసైను అను శిబిరశ్రేణి నిర్మించి రషియను దాడి నరికట్ట గల్గెను. కాని రష్యాసేన మహా పెద్దదగుటచే కేవలం సంఖ్యాబలంచే ఓడించెను. 1940 వ సం॥ మార్చిలో ఫిన్లాండు రష్యాకు లొంగిపోయెను. ఈ రషియా-ఫిన్లాండు యుద్ధంలో జర్మనీతప్ప అన్ని దేశాలు ఫిన్లాండు

వట్లు సానుభూతి కలిగియుండెను. బ్రిటను ఫ్రాన్సులు సహాయం పంపదలచినవి. కాని ఆ సహాయం ఫిన్లాండుకు అందే మార్గం లేకుండెను. ఓడినపిదప ఫిన్లాండు లడోగా సరస్సు పడమర తీరమును, కరేలియను భూసంధి మానరుహీంలైనులను విబోర్గు (లేక విపురి) రేవును రషియాకొసంగెను. ఉత్తరమున మీలవారి ద్వీపకల్పంకూడా రషియా కొసంగబడెను. హెల్సింకీకి చేరువగనున్న హాంగో నౌకాదళశిబిరంకూడ రషియా కొసంగబడెను. రషియాకు ప్రతికూలంగా యితర దేశాలతో సఖ్యత చేసుకోననిగూడ ఫిన్లండు ఒడంబడెను. అప్పట్లో రషియా-జర్మనీలు సఖ్యతగానుండేవి. ఇది ప్రాత కథ.

## నేటి యుద్ధం.

ఇపుడు రషియా జర్మనీతో తీవ్రయుద్ధంలో తెరిపిలేకుండా ఉన్న సమయమున ఫిన్లాండు 1940 వ సం॥ మార్చిలో గోల్పోయిన రాజ్యభాగాలను రషియానుండి తీసుకొనుటకై జర్మనీతో కలసి రష్యాపై యుద్ధం చేసింది. ఈ పదకొండు వారాల యుద్ధం ఫలితంగా తాను గోల్పోయిన రాజ్యభాగం ఫిన్లాండు తిరిగి సంపాదించింది. ఫిన్లాండు రషియాలు సంధి చేసుకుంటే తనకభ్యంతరం లేదని జర్మనీ ప్రకటించిందికూడాను. అందుచే ఫిన్లాండు సంధికై ప్రాకులాడుచున్నదనీ స్టాకుహోము అమెరికాలనుండి వచ్చిన వార్తలు తెల్పుచున్నవి. యుద్ధం కొనసాగించడానికి ఫిన్లాండును ప్రోత్సాహించుటకై ఫిన్లాండు సైనికులను పొగడుచును ధాన్యం విశేషంగా పంపుతాననియు జర్మనీ ప్రచారం సాగిస్తున్నది. అయితే రిటి అధ్యక్షునకు హిట్లరు పంపిన అభినందన సందేశము ఫిన్లాండు పత్రికలలో పడలేదు. జర్మను బుజ్జగింపులకు ఫిన్లాండు లొంగుటలేదు. రష్యా తన సైన్యమును కరేలియను భూసంధినుంచి దక్షిణమునకు ప్రాత సరిహద్దులవద్దకు విరమింపజేయగా ఫిన్లాండు సేనాధికారియగు మార్షలు మానరుహీంగారుగూడ తన సేనలను ఆ భూసంధినుండి యితరచోట్ల యుద్ధరంగములకు మరల్చెను. కరేలియను భూసంధికి దక్షిణమున చాల దగ్గరలోనున్న లెనినుగ్రాడు నగరం పట్టుకోవాలని జర్మనులు విశ్వప్రయత్నం చేయుచుండగా తోడ్పడు నుద్దేశం లేనట్లు, లెనినుగ్రాడుపై జర్మను దాడి ఏమైతే మాకేం అన్నట్లు మానరుహీంగారు ప్రవర్తించిరి. ఈ పని శాంతికోరియే చేసెనో లేక, సోవియటువారిదగు కరేలియా ఉత్తర భాగము నాక్రమించుటకై సైన్యాలను అచటికి మరల్చెనో యింకను స్పష్టంగా తెలియదు. లెనినుగ్రాడు ప్రాంతాలందు ఫిన్లాండు సేనలు యింకనూ విజయాలు పొందుతునే వున్నాయని జర్మనులు ప్రకటిస్తూనే వున్నారు. ఫిన్లాండు ప్రభుత్వం రష్యా ప్రాత చర్యలను నిందిస్తూ అధికార రీత్యా ప్రకటించెను. ఫిన్లాండు పరిశ్రమల మంత్రి టానరుగారు "మా మేలు కవసరమగునంతవరకు యుద్ధం కొనసాగించెదము" అని నుడివిరి. అయినా సంధి రాయబారాలు జరుగుతున్నాయని హెల్సింకీనుండి వచ్చుచున్న వార్తలను ఫిన్లాండు ప్రభుత్వం ఖండించడం లేదు. జర్మనులకు ఫిన్లాండుదేశీయులకు జగడాలు హెచ్చుతున్నాయి. ఈ రష్యా జర్మనీ యుద్ధంలో తామీ పోరాట భారాన్ని అంతా భరించవలసివచ్చిందని ఫిన్సుకు కష్టంగావుంది. అంతేకాక ఉత్తరమున సల్లానగర ప్రాంతములందు ఉత్తర ధృవం చలిబాధ భరించలేని జర్మనులను రషియా సైనికులు చావగొట్టుతూవుంటే ఫిన్సుకు జర్మనులపై గౌరవంపోయింది. రషియా తీసుకున్న రాజ్యం తిరిగి లభించిన పిమ్మటగూడా ఫిన్లాండు యుద్ధం సాగిస్తే సహించేదిలేదని ఇంగ్లాండు, అమెరికాలు ఖచితంగా తెలిపియున్నవి. కావున ఫిన్లాండు రషియాతో సంధిచేసుకొని శాంతి పొందాలని కోరుచున్నదనువార్తలు నమ్మవచ్చును. అమెరికాయే యీ సంధి కుదుర్చుటకు పూనుకొన్నదని న్యూయార్కు వరల్డు టెలిగ్రాఫ్ అన్న పత్రిక వ్రాసింది. ఇదెంతవరకు నిజమో చూడాలి.

---

# రష్యా - జర్మనీ యుద్ధ క్రమం.

**కీవును చుట్టివేయుట, లెనినుగ్రాడువద్ద తీవ్ర యుద్ధం.**

ఉత్తరమున మార్మాంస్కు రేవునుండి దక్షిణమున నల్లసముద్ర తీరంవరకు గల విశాల యుద్ధరంగమున జర్మనులు మరల తీవ్రదాడి ప్రారంభించిరి. మార్మాంస్కుపైకి నార్వే దేశంనుండి జర్మను సేనలు వచ్చినవి. రష్యాకు బ్రిటిషు సహాయం యీ వుత్తర దిక్కునుండి రాకుండా చేయుటకు యీ దాడి ప్రారంభింపబడియుండును. మార్మాంస్కునుండి లెనినుగ్రాడునకు గల రైలుమార్గమును తెగగొట్టుటకు ఫిన్లాండు సేనలు ప్రయత్నించుచున్నవని తెలిసి ఆ ప్రాంతమున (మార్మాంస్కుకు దక్షిణంగా 200 మైళ్ల దూరాన) రష్యనులు తిరుగు దాడి జరుపుచున్నారు. బ్రిటిషువారి నౌకాదళానికి చెందిన విమానాలు వుత్తర రంగమున ఆర్కిటికు సముద్ర రేవులగుండా జర్మనులు క్రొత్త సేనలు దింపకుండా కాపలా కాయుచున్నవి.

లెనినుగ్రాడు నగరంచుట్టు తీవ్రతరమగు యుద్ధం నేలపైని ఆకాశంలో విమానాలతోను జరుగుచున్నది. రష్యావారి బాల్టికు నౌకాదళం క్రొత్త సైన్యాలను లెనినుగ్రాడు చేరువనెచటా జర్మను నౌకలు దింపకుండా వారించుచున్నవి. పడమటను వెలికిలుయ్యాకువద్ద రష్యనుల తిరుగుదాడిలో గెల్చినచో లెనినుగ్రాడువద్దనున్న జర్మను సేనకు తమవారితో సంపర్కం తెగిపోవును. కావున అంతకుముందు కొద్దిరోజులలోగానే లెనినుగ్రాడు వశంకావాలని జర్మను సేనాధికారి ప్రకటించెను. లెనినుగ్రాడులో సైనికులు నివాసులును ధైర్యంగానే రక్షించుకొనుచు, తప్పక జయిస్తామని లండను వాసులకు రేడియో సందేశం పంపేరు.

మధ్య రంగమునందు రష్యా తిరుగు దాడియు, జర్మనుల చొచ్చుకొనిపోవుటయు యెదురు దిక్కులుగనే జరుగుచున్నను, భేటీలేకుండా యెడమయిపోయినట్లుంది. రష్యను సేనాని మార్షలు టిమొషింకొ సైన్యం యెల్నపురం వశపరచుకొన్న పిదప స్మోలెంస్కు నగరానికి 12 మైళ్ల దూరంవరకు వచ్చెననుచున్నారు. గోమెలువద్ద జర్మనుల దాడి అరికట్టబడింది. కాని దక్షిణమున బాగా ముందుకిపోగల్గుటచే చెర్నిగోవుపురమును రష్యనులు ఖాళీచేసిరి. ఇందువలన ఉక్రేను ముఖ్యపట్నమగు కీవుపై వొత్తిడి హెచ్చును.

నీపరునది దిగువభాగమువద్ద జర్మనులు నదిదాటి తూర్పునకు వచ్చిరి. బహుశ క్రిమియా ద్వీపకల్పముపైగానున్న పెరికాపు భూసంధివద్దకు పోదలచియుందురు. నది తూర్పు తీరమునందున్న క్రెముచగు అనుపురంకూడ జర్మనులు పట్టుకొనిరి. తూర్పున యింకాముందుకి విస్తరించియున్న సైన్యం దాడి సల్పుతున్నదని జర్మనులు ప్రకటిస్తున్నారు. కాని లెనినుగ్రాడును చుట్టివేసి బయట రక్షణ వలయమును చేదించితిమని చెప్పే డాబుకబురువంటిదే యిదికూడాను. క్రెముచగును ఖాళీచేసిన పిమ్మట రష్యనులు ఆ చేరువను తమ బలంకూడ దీసుకొని నీపరు నదిని నాల్గుచోట్లదాటి, పడమట తీర్మాన రెండు గ్రామాలను వశపరచుకొనిరి. ఇంకా దక్షిణమునందు

బ్రిటిషు క్రూసరు ట్యాంకులు.

ఈ పటములోవుండే ట్యాంకులు బహువడిగా నడుస్తాయి. వీటిని నడుపువారు బహు నిపుణులు



ఈ కాలపు క్రొత్త రకపు యుద్ధ విధానములో ట్యాంకులు చాల ప్రాముఖ్యత వహిస్తున్నాయి. వీటి విషయములో బ్రిటిషు సైన్య శాఖవారు ఎక్కువగా పరిశోధనలు జరుపుతున్నారు. ట్యాంకులను ప్రథమములోకనిపెట్టి సృష్టించినవారు వీరే.

జర్మనులు క్రొత్త దాడి యత్నాలుచేస్తున్నారు. బల్గేరియా రేవులగు వర్నా, బర్గాసులందు నౌకలను నిలిపియున్నారు. జర్మనీతో కూడరాదని బల్గేరియా ప్రభుత్వాన్ని రష్యా ప్రభుత్వం హెచ్చరించింది. రుమేనియను జర్మను సైన్యాలు ఒడెస్సా నగరాన్ని యింకా వశపరచుకోలేకుండావున్నాయి. ఒడెస్సా నిరోధం బలంగానేయుంది. 20,000 రుమేనియనులు యీ నెల మొదటి పది రోజులలో చంపబడ్డారని తెలియుచున్నది. జర్మను విమానదళం బడలికచూపుచు వెనుక తగ్గింది. రష్యా సహాయానికి బ్రిటిషు విమానదళంలో నొకభాగం అపుడే వచ్చి చేరింది.

# ఈ వారంలో యుద్ధ వార్తలు.

## విమానదాడులు.

11 వ తేది గురువారం రాత్రి వాతావరణం అనుకూలంగా లేదు. అయినను చాల బ్రిటిషు విమానములు జర్మనీ ఉత్తరభాగమున "కీలు" రేవునందలి నౌకా నిర్మాణశాలల పైకి, రాస్టాక్ రేవు పైకి దండెత్తివెళ్లి వేలకొలది బాంబులు వర్షించివచ్చినవి. ఆ రెండు పట్టణములలోను చాల భాగములు అగ్నిజ్వాలలకు ఆహుతి ఆయినవి. ఫ్రెంచి కోస్తాలోని లీహావ్రె, బులోను మొదలగు రేవులపైనను, ఫ్రాన్సునందలి ఉత్తరభాగపు పట్టాలమీదనుగూడ చాల బాంబులు వేయబడెను. 12 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు, జర్మనీలో లోహ పరిశ్రమలకు ప్రధానమగు రైను నదీ ప్రాంతముపై దాడులజరిపి ఫ్రాంకుఫర్టు నగరముపై అనేకవందల పెద్ద పెద్ద ప్రేలుడు బాంబులు వేసెను. చెర్బర్గు, సెయింటు నాజైరు మొదలగు ఫ్రెంచితీరపు రేవు పట్టణములు గూడ విమానదాడులకు గురియయ్యెను. ఈ దాడులనుండి ఒక్క విమానము మాత్రం తిరిగి రాలేదు. 13 వ తేది రాత్రి చాల విమానములు ఫ్రెంచితీరపు బ్రెస్టు రేవుపైకి జని అచ్చటి నౌకాశ్రయమును, నౌకానిర్మాణశాలలను పెద్ద పెద్ద ప్రేలుడు బాంబులతో ముంచి యెత్తెను. ఈ రేవును జర్మనులు తమ జలాంతర్గాములకు యుద్ధ నౌకలకు కేంద్రముగ నుపయోగించుకొనుచున్నారు. చాల బాంబులు నౌకాశ్రయమున మరమ్మతులలోనున్న షారక్ హార్స్టు, గ్నీసెనూ అను జర్మను యుద్ధ నౌకలకు తగిలి చాల నష్టముకల్గించెను. మరికొన్ని విమానములు ఫ్రాన్సునందు ఉత్తరభాగముపైకి జని అచటి జర్మను విమానాశ్రయములపై బాంబులువేసి ధ్వంసమొనర్చెను. 17 వ తేదీన బ్రిటిషు విమానములు జర్మనీ పశ్చిమ భాగమునం దసుజిన్ గార్ఫు, బెతూన్ మొదలగు పట్నములపై వందల కొలది బాంబుల వర్షించి విద్యున్నిర్మాణ శాలల శిథిల మొనర్చెను.

11 వ తేది రాత్రి కొన్ని జర్మను విమానములు బ్రిటను నందలి సముద్రతీరపు పట్నములలో అక్కడక్కడ బాంబులు వేసెను. కొంత ఆస్తికి నష్టము కల్గెను. కొందరకు దెబ్బలు తగిలెను. 12 వ తేది వుదయంకూడ బ్రిటిషు ఆగ్నేయ ప్రాంతములో ఒక పట్నంమీద ఒక శత్రు విమానము బాంబులు వేసిందిగాని నష్టం యెక్కువ గలుగలేదు. రాత్రి బ్రిటిషు ఈశాన్యపు పట్నములపై శత్రు విమానాలు బాంబులు వేసెను. ఆస్తికి కొంత నష్టంకల్గినది. శనివారంనాడు శత్రు విమానదాడులు అత్యల్పం. తూర్పు కోస్తా పట్నములో అతి స్వల్పమగు నష్టముకల్గినదిగాని ప్రాణనష్ట మేమాత్రము గలుగలేదు. 15 వ తేది రాత్రి బ్రిటనులో ఈశాన్య తీరమునందు ఒక పట్నంమీదమాత్రం ఒక జర్మను విమానం కొన్ని బాంబులువేసింది. దానివలన ఆస్తికి ఒకమాదిరి నష్టం కలిగింది. ప్రజలకుగూడ దెబ్బలు తగిలినవి. 16 వ తేది రాత్రి శత్రు విమానములు కొన్ని ఇంగ్లండు తూర్పు భాగముపైకి వచ్చెను. కొన్ని చోట్ల బాంబులు పడెనుగాని కష్టము కల్గింప లేదు. ఒక శత్రు విమానము పడగొట్ట బడెను.

## ఇటలీ, ఆఫ్రికా, మధ్యధరా.

10 వ తేది రాత్రి బ్రిటిషు విమానములు ఇంగ్లండునుండి 800 మైళ్ల దూరముననున్న ఇటలీ పైకి జని జెనోవా, టూరిన్ పట్టణములపై వందలకొలది బాంబుల వర్షించెను. బ్రిటను నుండి విమానములు ఇటలీపైకి మరల దాడి సాగించుటకు, 8 నెలలు తరువాత, ఇదియే ప్రథమము. సిసిలీ (ఇటాలియనులది) ద్వీపమునందలి పలెర్మో మొదలగు రేవు పట్టణములపైగూడ తీవ్రమగు విమానదాడులు జరుపబడెను.

ఈవారం లిబియా (ఉత్తర ఆఫ్రికా) ప్రాంతముల శత్రులు తమదాడులను హెచ్చించిరి. వానిలో ఇదివరకు కంటె విస్తారమగు సైనికబలాన్ని గూడ ఉపయోగించుచుండిరి. 11 వ తేదిన టొబ్రూకు (బ్రిటిషు) దుర్గంపై పెద్దవిమాన దాడిని జరిపిరిగాని, బాంబులు ఎక్కువ నష్టంకలుగజేయలేక పోయినవి. 12 వ తేదిన, 14 వ తేది రాత్రి శత్రు విమానములు, విడువకుండ తెల్లవారు వరకును టొబ్రూకు దుర్గముపై నిరంతరాయముగ బాంబులువేయుచునేయుండెను.

13 వ తేదిన టొబ్రూకునందలి ఒక బ్రిటిషు పటాలము శత్రుల గస్తీదళముపైబడి నిర్మూలించెను. దీనికి ప్రతీకారంగా, జర్మనుదళ టాంకులతోను ఫిరంగులతోను యెదిర్చెను. 3 జర్మను టాంకులను బ్రిటిషు సైన్యములు పట్టుకొనెను. లిబియా ఈజిప్టు సరిహద్దులయందు శత్రు సైనికదళ పటాలములు రెండు బ్రిటిషు సరిహద్దులదాటి 2 మైళ్లలోనికి చొచ్చుకొనివచ్చెను. విమానదళ సహాయంతో బ్రిటిషు సైన్యములు వాని నెదిర్చి వెనుకకుకొట్టి, ఒక టాంకును కొంతమంది ఖైదీలను పట్టుకొనెను.

మధ్యధరా సముద్రమందలి సైప్రెస్ దీవి రక్షణార్థము, బ్రిటిషుప్రభుత్వము కొత్తసైన్యములను పంపెను. శత్రుదాడుల తిరుగగొట్టుట కిచట సకల సన్నాహములును గావింపబడెను.

11 వ తేది రాత్రి జర్మను విమానములు సూయజు కాలువపైకి వచ్చి బాంబులు గుప్పించెను. కాని నౌకలకు గాని సైనిక - ఆయుధ శిబిరములకుగాని నష్టంకలుగలేదు. బ్రిటిషువిమానములు శత్రుల ప్రతిఘటించి పోరాడెను. ఒక శత్రువిమానం పడగొట్టబడెను. 14 వ తేదిన సూయజు ప్రాంతముపైన శత్రువిమానములు మరల దాడిసల్పెను. కాని నష్టం ఏమీ కలుగలేదు. ఈజిప్టు రాజధానియగు కెయిరోలోను, ఇతర ప్రాంతములలోనుగూడ శత్రువిమాన దాడుల హెచ్చరికలు గావింపబడెను.

అబిసీనియాలో ఇంకను ఇటాలియనుల స్వాధీనమున నున్న గోండార్ ప్రాంతమున—బ్రిటిషు సైన్యములు పలు ప్రదేశములలో శత్రుసైనిక పంక్తులను భేదించిరని 17 వ తేదిన ప్రకటింపబడెను.

15, 16 వ తేది రాత్రులయందు బ్రిటిషు విమానములు లిబియాలోని బెంఘాజీరేవుపై తీవ్రమగు దాడులసల్పి, రేవును చాలవరకు ధ్వంసమొనర్చెను. కొలదిరోజులలోనే లిబియాపై బ్రిటిషు సైన్యములు దాడి సాగించునని జర్మనులు తలంచుచున్నారు.

16 వ తేది రాత్రి కెయిరోపై జర్మను విమానములు వేసిన బాంబులవలన 30 మంది ప్రజలు హతులైరి. ఈ దౌర్జన్య చర్యలను ఆక్షేపించుచు, ఈజిప్టు ప్రభుత్వము అక్షరాజ్యముల ప్రభుత్వములను హెచ్చరించిరి.

## టర్కీ—ఈరాక్—ఈరాన్.

నౌకా నిర్మాణశాలలను, నౌకాశ్రయములను మరమ్మతుల చేసి సరియగుస్థితియందుంచు విషయములలో సలహాయొసగుటకుగాను ఇద్దరు బ్రిటిషు నౌకాదళాధికారులు టర్కీనిచేరిరి.

11 వ తేదిన టర్కీ తూర్పు ప్రాంతములలో పెద్దభూకంపము సంభవించెను. 500 పైగా హతులైనట్లు ప్రకటింపబడెను.

టర్కీయందలి జర్మనురాయబారియగు వాన్ పేపను హిట్లరును దర్శించుటకు జనెను. టర్కీయెడల గైకొనవలసిన చర్యలగురించి ఈ సంభాషణలో నిర్ణయించుకొందురని వదంతులుగ నున్నవి.

బల్గేరియాలో ఆక్సిసురాజ్యములు సైన్యములను కేంద్రీకరించినను అవి టర్కీపై దాడివెడలుటకు గాదని టర్కీ అధికారులు దెలుపుచుండిరి.

ఈరాక్ ప్రభుత్వ మంత్రివర్గమున విభేదములచే ఆర్థికమంత్రియగు ఇబ్రహీం కమలుగారు 8 వ తేదిన రాజీనామా నొసగెను.

ఈరాన్ నందున్న జర్మను ఇటాలియను ప్రజలను తమకు అప్పజెప్పవలెననియు జర్మను ఇటాలియను రాయబార కార్యాలయములను మూసివేయవలెననియు బ్రిటిషు-రష్యను అధికారులు ఈరాన్ ప్రభుత్వమును గోరిరి. వారందుకు అంగీకరించిరి.

జర్మనులను అటుల పట్టి అప్పగించరాదనియు, ఆక్సిసు రాయబార కార్యాలయములను మూసివేయరాదనియు, వ్రాసిన ఒక పత్రికను ప్రభుత్వమువారు అణచివేసిరి. ఈరాన్ రాజు (షా)ను, అతని బంధువులును ప్రేరేపింపగా ఆ పత్రికటుల వ్రాసియుండునని తలంచుచున్నారు.

రాజ్యాంగమున సంస్కరణల గావించి పరిపాలనాధికారమును ప్రజా ప్రతినిధుల పరమొనర్పవలెనని క్రొత్త మంత్రివర్గమువారు రాజును దర్శించి విన్నవించిరి.

15 వ తేదిన ఈరాన్‌లో మరి 250 జర్మనులు బ్రిటిషు-రష్యను అధికారులకు అప్పగింపబడిరి.

10 వ తేదిన ఈరానియను పార్లమెంటు సమావేశమై క్రొత్త మంత్రివర్గము బ్రిటిషు - రష్యా అధికారులతో గావించుకొనిన ఒడంబడిక షరతులను ఆమోదించెను. మంత్రివర్గమునందు విశ్వాసమును ప్రకటించెను.

13 వ తేదిన మొదటి జట్టుగా 80 మంది జర్మనులను పట్టి రష్యా, బ్రిటిషు అధికారులకు అప్పగించిరి. వారిలో నాజీ కుట్రదారులు చాలమంది కలరు.

ఈరాన్ రాజగు రిజాఖాన్ పహ్లవిగారు 16 వ తేదిన రాజ్యపరిత్యాగముచేసి, రాజధానియగు టెహరన్ పట్టణమును వదలి, ఇస్పహాన్ నగరమునకు వెళ్లిపోయెను. అతని కుమారుని రాజుగ నొనర్చిరి. 17 వ తేదిన బ్రిటిషు సైన్యములును, రష్యన్ సైన్యములును టెహరన్ నగరమును ప్రవేశించి ఆక్రమించెను.

సిరియాయందు స్వతంత్ర ప్రభుత్వమును నెలకొల్పుకొనుటకు, స్వతంత్ర ఫ్రెంచి అధికారులు సిరియా ప్రజలకు అధికారము నొసగుచు ప్రకటనను గావించిరి. 18 వ తేదీన షేయిక్‌టాజుద్దీన్ హాసనీగారు సిరియను మంత్రివర్గము నేర్పరుచుచున్నారు.

## అమెరికా—అట్లాంటిక్.

పనామాకు 1,000 మైళ్ల పడమటుగా, పసిఫిక్ మహాసముద్రమున ఒక జర్మను జలాంతర్గామి విహరించుచు, "కోటునోంపాక్" అను డచ్చి నౌకను ముంచివేసెను. మరికొన్ని ఇతర నౌకలగూడ ముంచివేసెదనని బెదరించెను. కోటనోపాక్ నౌక, అమెరికా సంయుక్తరాష్ట్రములకు రబ్బరు మొదలగువానిని తీసుకొని పోవుచుండెను. నార్వే ప్రాంతమున 11 వ తేదిన మంటోనా అను మరియొక అమెరికను సరకుల నౌక ముంచివేయబడెను.

12 వ తేది ఉదయము రూజ్వెల్టు అధ్యక్షుడు, రేడియో ద్వారా ప్రసంగించుచు, ఇకమీద జర్మను నౌకలుగాని ఇటలీ నౌకలుగాని అమెరికా రక్షణప్రాంతములను ప్రవేశింపరాదనియు, అటుల ప్రవేశించినచో చూచినంతనే వానిపై ఫిరంగులపేల్చి ముంచివేయబడుననియు ప్రకటించెను.

15 వ తేదిన రూజ్వెల్టు అరువు కవులు చట్టము క్రింద ఇంతవరకు గావింపబడిన సహాయములను వివరించుచు అమెరికా శాసనసభల కొక సందేశమంపెను. దాని ప్రకారము, అక్షరాజ్యముల నెదిర్చి పోరాడుచున్న దేశములకు, ఆగస్టు 31 వ తేదికి, 190,447,670 డాలర్ల విలువగల మందుగుండు సామాను యెగుమతిచేయబడెను. ఇంకను 35,946,705 డాలర్ల మందుగుండు సామగ్రి యెగుమతికి సిదముగనున్నది. యుద్ధనౌకలకు మరమ్మతులకు 78,169,377 డాలర్లు వెచ్చింపబడెను. 162,000,000 సరకు ఇంకను తయారగుచున్నది. ఈ సరకులు మొత్తము 12 దేశములకు సహాయముగ పంపబడెను. కాని వానిలో అత్యధిక భాగము బ్రిటనుకు పంపబడెను.

రూజ్వెల్టు ఉత్తరువు ప్రకారము, అమెరికా తీరమునుండి ఐస్లాండువరకునుగల సముద్ర భాగమున, ఈ నెల 16 వ తేదినుండి జర్మను-ఇటాలియను నౌకలు ప్రవేశించినచో ముంచివేయబడుననియు, వాని దాడులనుండి అన్ని దేశముల నౌకలకును రక్షణ మొసగుననియు, అమెరికా నౌకాశాఖ కార్యదర్శియగు కర్నలు నాక్సుగారు 15 వ తేదిన ప్రకటించెను.

అమెరికా తాటస్థ్య శాసనమును రద్దుచేసి, సంయుక్త రాష్ట్ర నౌకలకు ఆత్మరక్షణకు ఫిరంగుల నమర్పవలసినదని రూజ్వెల్టు అధ్యక్షుడు త్వరలోనే శాసన సభలను గోరునని అమెరికాలో అనుకొనుచున్నారు.

యుద్ధ సామగ్రి అమెరికానుండి సురక్షితముగ బ్రిటనుకు చేరుటకుగాను, సంయుక్త రాష్ట్ర ప్రభుత్వము తమ యుద్ధ నౌకల కైనాతియొసగియు, అన్ని యితర విధములుగను ప్రయత్నించుటకు నిశ్చయించుకొనెనని 17 వ తేదిన కర్నలు నాక్సుగారు ప్రకటించిరి.

అమెరికను సైనికులను, అమెరికా సరిహద్దులదాటి ఇతర దేశములకు పంపరాదను నిషేధమును తొలగించి, హిట్లరు నోడించుటకు యేప్రాంతమునకైన పంపుటకు సిద్ధపడవలెనని అమెరికాలోని వృద్ధ సైనికుల సంఘము తీర్మానించెను.

## రష్యా.

10 వ తేదీన రష్యను సైన్యములు, స్మాలెన్స్కునకు ఉత్తరముగ 120 మైళ్ల దూరమునగల వెలికిలూకి అను పట్టణమువైపునకు బ్రహ్మాండమగు దాడిని ప్రారంభించెను. ఆరోజున ఈరంగమున 12 వేల జర్మను సైనికులు అధికారులు హతులైరి. మార్షలు టిమొషెంకిగారి (రష్యను) సైన్యములు స్మాలెన్స్కుపైకిని, దానికి దక్షిణముగనుగూడ పెద్ద దాడుల సాగించి శత్రుల వెనుకగొట్టుచుండెను. రష్యనులు 15 వ తేదీన స్మాలెన్స్కునకు 30 మైళ్ళదూరముననున్న యెర్నొవ్నొవో నగరమును తిరిగి పట్టుకొనిరి. స్మాలెన్స్కును ముట్టడించుటకు సిద్ధముగ నున్నవి.

ఈ రంగమునకు నైరుతివైపుగా గోమెలు పట్టణమునుండి జర్మను సైన్యములు మరికొంత ముందుకు జనినవి.

దక్షిణమున యుక్రేనియాలో క్రెమెచగ్ పట్టణమువద్ద జర్మనులు నీపరునదినిదాటి తూర్పుతీరమునకు వచ్చి ఆ పట్టణము నాక్రమించిరి. అంతకుపూర్వమే రష్యను లాపట్టణమును ఖాళీచేసిరి.

ఒడెస్సా రేవు పట్టణమున రష్యను సైన్యములు శత్రు దాడుల నింకను వెనుకగొట్టుచు భయంకరముగ పోరాడుచున్నవి.

ఉత్తరమున, ఆర్కిటికు సముద్రప్రాంతమున రష్యనులకు గల మర్మనిస్కు రేవును ఆక్రమించుటకు జర్మనులు నార్వేనుండి దాడి సాగించుచున్నారు.

నీపరునది దక్షిణభాగమున నాల్గుచోట్ల రష్యను సైన్యములు తిరిగి నదినిదాటి నాల్గైదుచోట్ల పడమటితీరమును ఆక్రమించెను.

బాల్టికుప్రాంతమున రష్యనుల ప్రధానరేవు దుర్గమగు లెనిన్గ్రాడును, యెటులైనను సరే, కొలది రోజులలోనే పట్టుకొనవలెనని హిట్లరు జర్మను సైన్యములకు ఉత్తరువు చేసెను. లెనిన్గ్రాడు నగర పరిసరములలో ఉభయపక్షముల సైన్యములకును, భయంకరమగు మహాసంగ్రామము వారము రోజులుగా సాగుచున్నది.

బల్గేరియా ప్రభుత్వము తమదేశమున అక్షరాజ్యముల సైన్యములకు సైనికసన్నాహములకు సౌకర్యము లొసగుచు అచటినుండి రష్యాపై జర్మనులు దాడి సాగించుటకు తోడ్పడుచున్నదనియు, ఇది తాటస్థ్యమునకు నిరాక్రమణభావమునకు విరుద్ధమనియు, ఇట్టి చర్యల వెంటనే మాననియెడల తగు ప్రతీకార మొనర్పవలసియుండుననియు రష్యా ప్రభుత్వము, బల్గేరియా ప్రభుత్వమునకు ఆక్షేపణపత్రమును పంపెను. బల్గేరియాప్రభుత్వ మీ యారోపణలు అబద్ధమని నిరాకరించుచు, యుద్ధసన్నాహముగ—సైన్యమును సమీకరించియుంచుటకు ఉత్తరువులు గావించెను. ఇటలీ యుద్ధనౌకలను నల్ల సముద్రములోనికి తెచ్చుకొనుటకుగాను, హిట్లరు కొన్ని ఇటాలియను నౌకలను బల్గేరియా ప్రభుత్వపుపేరునకు మార్పించెనని తెలుపబడెను.

బల్గేరియాగూడ, రష్యాపై యుద్ధమున చేరవలెనని హిట్లరు తెలియజేసెనని ఇటాలియను అధికారులు ప్రకటించిరి.

రష్యాకు కావలసిన విమానములు అపుడే పంపబడుచున్నవనియు, బ్రిటిషు విమానదళమున వైమానికులతో సహా 100 విమానములపుడే చేరెననియు ప్రకటింపబడెను. బ్రిటనుకని ఉద్దేశింపబడిన ఆయుధ సామగ్రిలో కొంతభాగము రష్యాకు మార్చబడుచున్నది.

హిట్లరు, హంగరీ ప్రభుత్వాధ్యక్షుని పిలపించి, రష్యా రంగమున కింకను సైన్యములను పంపవలసినదని కోరెను. రుమేనియానుగూడ అటులనే అడిగెను. ఇటలీనుండి వచ్చిన క్రొత్తసైన్యములు రష్యాయుద్ధమున పాల్గొనుచున్నవి.

రష్యాతో ప్రస్తుతము ఏవిధమగు సంధి మాటలు జరుగుట లేదనియు, ప్రస్తుతము ఫిన్లండు సాగించుచున్న సంగ్రామము తన స్వంతమేగాని జర్మనీతో సంబంధములేదనియు, ఫిన్లండు ప్రభుత్వ మంత్రి టానరుగారు ప్రకటించిరి.

## విషీ.

కొన్ని వారములు క్రిందట ఒక ఫ్రెంచి యువకునిచే రివాల్వరుగుండ్లకు గురిచేయబడిన, మాజీ ఫ్రెంచి ప్రధానియు జర్మను అభిమానియు అగు పీరీ లావలుగారు వర్సైయిల్సు వైద్యశాలయందు తిరిగి ఆరోగ్యమును కోలుకొనెను. మెల్లగ నడువగల్గుచుండెను. ఇతడు 9 వ తేదిన పారిసు నగరమునకు తిరిగివెళ్లెను.

11 వ తేదిన బ్రిటిషు విమానములు, ఫ్రెంచి దక్షిణతీరపు (మధ్యధరా) రేవు పట్టణములపైనగూడ బాంబులువేసినటు ఫ్రెంచి పత్రికలు ప్రకటించెను.

విషీ మంత్రివర్గము 13 వ తేదిన సమావేశమై ప్రజలలో ప్రభుత్వముపై వ్యాపించుచున్న ప్రాతికూల్యమును అణగగొట్టుటకుగాను క్రొత్త శాసనముల కొన్నిటిని గావించిరి. చాల పట్టణములలో వందలకొలది యువకులు, కమ్యూనిస్టులు అనుపేర అరెస్టు చేయబడుచున్నారు.

జర్మను ఆక్రమణ క్రిందనున్న ఫ్రెంచి ప్రాంతములలో ఆయుధములు ధరించినవారికి మరణదండన విధింపబడునని ప్రకటింపబడెను. అప్పటికిని, పారిస్ నగరములో జర్మను సైనికులపై దౌర్జన్యములు సాగుచునేయున్నవి.

## దూరప్రాచ్యము.

దూరప్రాచ్యమున విషమ పరిస్థితుల తొలగించుటకు వాషింగ్టనులో సంయుక్తరాష్ట్ర అధికారులకు జపాను రాయబారికి రాయబారము లింకను జరుగుచున్నవని 12 వ తేదిన జపానులో ప్రకటింపబడెను.

అమెరికాకు—జపానుకు స్నేహము కుదురుట అసంభవమనియు, త్వరలోనే ఉభయదేశములకును సంగ్రామము తప్పదనియు, అందుకు సిద్ధముగ నుండవలెననియు జపాను రాజకీయపక్షనాయకుడగు సీగోనకానోగారు జపాను ప్రజలను 12 వ తేదిన హెచ్చరించెను.

వాషింగ్టనులో సంప్రదింపుల ఫలితముగ, జపానుకు—అమెరికాకు యేదో యొకవిధమగు సమాధానము కుదిరెనని 15 వ తేదిన వదంతులు వ్యాపించియున్నవి. ఆ యొడంబడిక ప్రకటింపబడువేళకు కొన్ని చిక్కు లేర్పడెననియు అందుచే ప్రకటన నిలచిపోయెననియు, కాని ఇంతమాత్రమున రాయబారములు భగ్నముగావనియు విచీ వార్తాసంఘము ప్రకటించెను.

దూరప్రాచ్యమున తొందరలేదని ప్రమత్తతో నుండరాదని ఆస్ట్రేలియా ప్రధాని ప్రకటించెను. ప్రస్తుతము జపాను అన్నివైపులను శత్రువర్గముచే చుట్టుముట్టబడెననియు, అందుచే యుద్ధమునకు దిగజాలదనియు బ్రిటిషు మంత్రి డఫ్-కూపరుగారు నుడివిరి.

చైనాలో హాంకో ప్రాంతమున జరిగిన పెద్ద సంగ్రామమున జపాను సైన్యములు నెం 4 రు కమ్యూనిస్టు సైనికదళములను శిథిలమొనర్చి యోడించెనని 11 వ తేదిన జపాను అధికారులు ప్రకటించిరి. హునాన్ రాష్ట్రమున, ఉత్తరరంగములలో తమ సైన్యములు జపాను సైన్యముల నిర్మూలించి టియూన్ షో అను పట్టణమును ఆక్రమించుకొనెనని చైనా సైనికాధికారులు 13 వ తేదిన ప్రకటించిరి. పీకెంగునకు పడమటివైపున, నెం 18 రు (చైనా కమ్యూనిస్టు) దళముపై జపాను సైన్యములు సాగించుచున్న దాడిలో 13 వ తేదిన జపానీయులు మొదటిసారి చైనా సైన్యముల వెనుకభాగమున, గాలిగొడుగుల సహాయంతో విమానాలమీద, సైనికుల దింపుటకు ప్రయత్నించిరనియు, కాని అటుల దిగినవారందరు నిర్మూలింపబడిరనియు చైనా అధికారులు ప్రకటించిరి.

## నౌకానష్టములు.

10 వ తేది బుధవారమునాడు నార్వేతీరముగ ప్రయాణమొనర్చుచున్న జర్మను నౌకల జట్టును బ్రిటిషు విమానము లెదిర్చి, వానిలో ఒక పెద్ద సప్లయి నౌకను ముంచివేసెను.

12 వ తేదిన మధ్యధరాసముద్రములో ఒక డచ్చి జలాంతర్గామి ఇటాలియను నౌకలనెదిర్చి 6,000 టన్నుల సప్లయి నౌక యొకదానిని ముంచివేసెను.

13 వ తేదిన నార్వే సమీపమున సముద్రము ప్రయాణమొనర్చుచున్న శత్రు సప్లయి నౌక నొకదానిని (6,000 టన్నులు) బ్రిటిషు విమానములు ముంచివేసెను. ఆరోజున మధ్యధరాసముద్రమున బ్రిటిషు విమానములు నాల్గు జర్మను నౌకలను ముంచివేసెను.

11 వ తేదిన అట్లాంటికు సముద్రమున ప్రయాణమొనరుచున్న బ్రిటిషు నౌకలజట్టును జర్మను జలాంతర్గాములును, జర్మను విమానములును యెదిర్చి, 8 నౌకల ముంచివేసెను. మిగతా నౌకలు సురక్షితముగ గమ్యస్థానము చేరెను.

15 వ తేదిన ఫ్రిజియనుదీవుల సమీపమున శత్రునౌకలు ప్రయాణమొనర్చుచుండగా బ్రిటిషు విమానము లెదిర్చి రెండు పెద్ద నౌకలను ముంచివేసెను.

## ఆక్రమిత ప్రాంతములు.

రష్యా యుద్ధరంగములలో చాల సైన్యమును కోల్పోవటంవల్లనూ, ఆహారపదార్థములు దొరకకపోవడంవల్లనూ, రుమేనియా ప్రజలలో తీవ్రమైన అసంతృప్తి వ్యాపించింది. రష్యాపై యుద్ధం మానవలెనని ప్రజలు ఆందోళన చేస్తున్నారు. జర్మనులపై దౌర్జన్యము లధికమగుచున్నవి. అని రుమేనియా నుండి పారిపోయివచ్చుచున్న ప్రజలు తెలుపుచున్నారు.

నార్వేలో, కర్మాగారములలో కార్మికులలో అలజడి వ్యాపింపజేయుచుండిరను కారణముచే, జర్మను అధికారులు కార్మిక నాయకులకు యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్షల విధించిరి. 11 వ తేదిన నార్వేదేశమందంతటను కార్మికులందుచు సమ్మెకట్టిరి. నార్వే రాజధానియగు ఆస్లో నగరమున వారము రోజులు సైనికశాసనమును అమలుజరిపిరి. సర్వియా, గ్రీసు, క్రోషియా (యుగోస్లావియా)లలో ప్రజల తిరుగుబాటులు హెచ్చుచున్నవి. వాని నణచుటకు సైనిక సహాయము నంపవలసినదని క్రోషియా అధికారులు మసులోనికి విజ్ఞప్తినంపిరి.

## తటస్థదేశములు.

స్విట్జర్లండునందలి పట్నములపై బ్రిటిషు వైమానికులు పొరబాటున బాంబులువేసినందుకు, నష్టపరిహారముగ బ్రిటిషు ప్రభుత్వము 1,110,000 ప్రాంకులను స్విట్జర్లండు ప్రభుత్వమునకు చెల్లించెను.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.